వేదధర్మ గ్రంథమాల-౨౨ ఓ౩మ్

# వైదిక ధర్మము మాస పత్రిక

పంజీకరణ సం. ౭౭౭౫/౭౭/తపాల/హైద్/నిజా/౬౭

'మనుర్భవ జనయా దైవ్యం జనమ్' ॥ఋ.౧౦.౫౩.౬॥

సత్యాసత్యము నెఱుగగల మానవుడవు కమ్ము.

దివ్యగుణములు గల మానవులను నిర్మింపుము.

---

సంపుటి౬ | సౌర సహస్(మాఘము౯౯౧౫౪౮) ౨౦౫౦వి.సం. | సంచిక౬

---

## వేదాలలో అస్త్ర శస్త్ర విజ్ఞానము

కర్త :

**మనోహర్ విద్యాలంకార్**

అనుకర్త :

**మనస్వీ**

సంపాదక

**ఆచార్య వేదవ్రత మీమాంసక**

---

**ఆర్ష గురుకులము వడ్లూరు, కామారెడ్డి-౫౦౩ ౧౧౧**

ఆజీవనము : రూ. ౩౫౦-౦౦ వార్షిక శుల్కము రూ. ౩౫-౦౦

# వేదాలలో అస్త్ర శస్త్ర విజ్ఞానము

పరోపకారీ చైత్రం.౨౦౫౦-వి.సం. మనోహర్ విద్యాలంకార్

[వేదాలు సమస్త సత్య విద్యల గ్రంథాలు. వాటిలో విజ్ఞానము కూడ కలదు. విజ్ఞానముతో పాటు శస్త్రాస్త్రముల ప్రతిపాదన కూడ కానవగును.

ఇది వైజ్ఞానిక యుగము. నేటి విజ్ఞానము మానవ సమాజాన్ని కొన్ని గంటలలో భస్మీభూతము చేయగలదు. ఇది ఆశ్చర్యము కలిగించును. ఈ శస్త్రాస్త్ర విద్య వేదాలలో సహితము గోచరించుచున్నది. ఈ విషయమును క్రింది వ్యాసములో చూడగలరు. వేదాలలో ఈ విద్య గలదన్న కొందరికి నచ్చదు. వారికి ఇది అసంభవము, కేవలము కల్పితము అనిపించును. వారికి మన్వాది దయానందాంత మహర్షులు ప్రతిపాదించిన సిద్ధాంతము సత్యమని తెలిసికొనుట కిట యోగీంద్రుడని ప్రసిద్ధి జెందిన శ్రీ అరవింద ఘోష ఘోషించిన ఉద్ఘోషను పేర్కొనుచున్నాను.

"వేదాలలో కేవలము ధర్మమే కాదు. విజ్ఞానము కూడ కలదు. దయానందుని ఈ భావాల వలన విస్మితులు కావలసిన పనియే లేదు. ఈ నాటి వైజ్ఞానికులకు తెలియని విజ్ఞాన విషయములు వేదాలలో గలవని నా అభిప్రాయము. ఈవిధముగా [వేదాలను] చూచిన యెడల దయానందుడు వేదాలలో నిహితమై ఉన్న విజ్ఞాన విషయములను అల్పోక్తితోనే పేర్కొన్నాడు కాని అత్యుక్తితో కాదని తెలియుచున్నది."

("దయానంద ది మ్యాన్ అండ్ హిజ్ వర్క్స్" — అరవింద)

శ్రీ అరవిందుని కాలము నాటికే కాదు ఇప్పటి వరకు కూడ తెలియని అనేక విషయాలు వేదాలలో ఉన్నవని ఒప్పుకొనక తప్పదు.

ఆ నాటి విజ్ఞానానికి ఈనాటి విజ్ఞానానికి ఒక ప్రముఖ భేదము కలదు. నాటి మానవులు మానవులు. నేటి మానవులు అటుల లేరు. నేటి మానవుల ధ్యేయము ౧. ధనము, తద్వారా పంచేంద్రియముల సుఖమును పొందుట, మరియు ౨. సన్మానము. నేటి మానవుడు లౌకిక సుఖప్రాప్తి

క్రూరుడు తోటి మానవులనే కాక ఇతర ప్రాణులను ఘోరముగా హింసించుచున్నాడు. తన ప్రతిష్ఠ కొరకు అతడు చేయని దుష్కార్యము లేదు. నాటి మానవుల ఏకైక ధ్యేయము ఈశ్వరుని ద్వారా లభించు సుఖమును పొందుట. దానికి ఏకైకోపాయము అహింస— నిస్వార్థ విశుద్ధ ప్రీతి-సమస్త ప్రాణులను తనవలె ప్రేమించుట. దానినే పరోపకారము అనవచ్చును. ఉదాహరణకు- ఈనాటి ప్రధాన మంత్రులు తమ ప్రయోజనాలకై ఇతరుల ప్రాణాలను, ధనమును బలిగొనుచుండుట ప్రతి వ్యక్తికి తెలిసిన విషయమే. నాటి మానవులైన ఆర్యశిరోమణి భగత్‌సింహ, అల్లూరి సీతారామరాజు మొదలగువారిని అనుసరించుచున్న కొందరు మానవులే నేటి మానవులు.

నేటి మానవులు వేదాలను అనుసరించి జీవితము గడిపినచో న్యాయముగా సుఖశాంతిని అనుభవించగలరు. వారి జీవితముల వలన ఇతర మానవులకే కాదు, ప్రాణి మాత్రులకు సుఖము లభించగలదు. (సంపా.)]

ఋగ్వేదములో అస్త్రశస్త్ర శబ్దములు లేవు. యజుర్వేదములో అస్త్ర శబ్ద ప్రయోగము లేదు. కేవలము ఒకసారి 'ప్రజాపతిః శస్త్రాణాం రూపమాప్నోతి' (యజు. ౧౯-౨౨) అను మంత్రమున శస్త్ర శబ్దము ప్రయోగింపబడినది. ఈ సందర్భములో శస్త్రము యొక్క విభిన్నార్థములు "వైదిక స్తుతి వాక్యము" ను ప్రకటించును. అథర్వవేదములో శస్త్ర శబ్దము లేదు. కాని 'అస్త్ర' శబ్దము "ఆదిత్య అస్త్రమేషాం నాశయతు" [అథర్వ. ౧౧-౧౨-౧౬] అను ఒక మంత్రమున గలదు.

ఐనను వైదిక సంహితలలో, నిఘంటువుల ద్వారా సంకలనము చేయబడిన ౧౮ వజ్రనామముల ద్వారా అత్యుత్కృష్ట అస్త్ర శస్త్రముల గురించి ఆలోచించబడినది. అవి ఇప్పటి సంహారక అస్త్రములకన్న ఏ మాత్రము అల్పశక్తి గలవి కావనిపించుచున్నది.

వజ్రనామము గల ఆయుధముల నాల్గు శ్రేణులు:-

౧. అస్త్ర-అసు క్షేపణే ధాతువు నుండి ఏర్పడును. అది శత్రువుపై విసిరివేయబడును. బాణము బల్లెము, గోలి(గుండు),బాంబు మున్నగునవి. ఈ శ్రేణికి చెందిన ఆయుధములలో—

విద్యుత్- "అస్తుర్న దిద్యుత్త్వేష ప్రతీకా'' ఋ.౧-౬-౨-౭)

హేతిః- "బ్రహ్మ ద్విషే తపుషిం హేతిమస్య'' (ఋ.౨-౩౦-౧౮)

సాయక-"న సాయకస్య చికితే జనాసః'' (ఋ.౩-౫౩-౨౩) అను మూడు శబ్దములు వజ్రనామములలో వ్రాయబడినవి. ఇవిగాక ఇషు పర్యాయ వాచక శబ్దములు శరవ్యా-ఓషిధి, పక్షిణీ హేతి, ఉలాక, శశ మున్నగు శస్త్రముల చర్చగూడ వేద సంతహిలలో గలదు.

౨. 'శస్త్ర' భేదములు నాలుగు.అవి పాణిముక్త, యంత్రముక్త, ముక్తాముక్త, అముక్త, అనునవి. పాణిముక్తములో బల్లెము, త్రిశూలము, పాషాణము మొదలగునవి, యంత్రముక్తములో ఇషు (బాణము)' గోలి (గుండు) బాంబు మొదలైనవి, ముక్తాముక్తలో బల్లెము (బర్చీ) గదా, ఛురిక మున్నగునవి. అముక్తములో కరవాలము, అర్కము (చక్రము) పేర్కొనబడినవి. ఇందు సమస్త వజ్ర వాచక శబ్దములను,వాటి ద్వారా పేర్కొనబడిన సమస్త శస్త్రాస్త్రములను గ్రహింపవచ్చును. పాణిముక్తములు, యంత్రముక్తములు అని శక్తి అస్త్రములు రెండు విధములు.

౩. శీత యుద్ధములో ప్రయోగింపబడు ఆయుధములు-ఉదాహరణకు అర్కః = అన్నము, స్తుతి, పూజ.

"ఇంద్రః పూర్భిదాతిరద్దా సమర్కైః విదద్వసుర్దయ మా నో
వి శత్రూన్" [ఋగ్వేదము ౩-౩౪-౧] హింసన్।

యదా బలస్య పయతో జసుంభేద్ బృహస్పతిరగ్ని తపోభిరర్కైః।

ఋగ్వే. ౧౦-౬౮-౬ నుండి (వినాశకస్య నాశక ప్రభావ)

బృహస్పతిర్హంత్యమిత్రమర్కైః । ఋగ్ ౬-౭౩-౩ ।

౪. అంతర్రాష్ట్రీయ క్షేత్రములో ప్రయోగింపబడ్డ ఉపాయములు:

కుత్సా, నింద, చెడ్డపేరు, (దుష్కీర్తి కుత్సః)
సద్యో దస్యూన్ ప్రమృణ కుత్స్యేన (ఋ. ౪-౧౬-౧౨)
త్వం కుత్సేనాభి శుష్ణమింద్రాశుషం యుధ్య (ఋ. ౬-౩౧-౩)
ఈ ఉపాయమును పాకిస్తాన్ విరివిగా ప్రయోగించును. ఈ విషయమున మనము చాల వెనుకబడి యున్నాము.

౫. ఓషధుల మరియు రాసాయనిక ద్రవ్యముల రోగక్రిమిఉపం ద్వారా శత్రువుల జల వాయువులను దూషితము చేసి. ప్రజలలో, సైన్యములలో రోగము వ్యాపింపజేసి వారిని ఆత్మ సమర్పణ గావించుటకు వివశులను చేయుట. ఈ ఉపాయము అంతర్జాతీయ దృష్ట్యా నీచము, నిషిద్ధము, శిక్షార్హమైనది. ఈ ఓషధీ నామక శస్త్రము వజ్ర నామములలో వ్రాయబడ లేదు. అందువల్ల దీనిని ఐదవ వరుసలో లెక్కించు చున్నాను.

అథర్వవేదము ౧౯వ కాండము ౨౮, ౨౯ సూక్తములు:- ఈ రెండు సూక్తములలోని దేవత దర్భమణి. దర్భ శబ్దము 'దౄ-దృ విదారణే' ధాతువునుండి ఏర్పడినది. మణి శబ్దము శిరోమణి వలె శత్రు సంహారము చేయు సేనాపతుల కొరకు,శిరోమణివంటి వాటి ముఖ్య సేనాధిపతుల కొరకు ప్రయోగింపబడినది. మచ్చుకు ఒక మంత్రము.
(సపత్నక్షయకామో) బ్రహ్మ. దర్భమణిః. అనుష్టుప్ ఛందస్సు.

జహి దర్భ సపత్నాన్మే జహి మే పృతనాయతః।
జహి మే సర్వాన్దుర్హార్దో జహి మే ద్విషతో మణే॥అథ. ౧౯--౯-౯॥

ఇందు దర్భమణి (ముఖ్యసేనాపతి) కి బ్రహ్మ(రాష్ట్రప్రముఖుడు) రాజ్యము పట్ల దుర్భావముగల శత్రువులను మరియు సైన్యములో అతని రాష్ట్రమును ఆక్రమించిన శత్రువును నశింపజేయుటకు ౧౩ విధముల శస్త్రాస్త్రములను ప్రయోగించుటకు ఆదేశించుచున్నాడు. దీని వలన శత్రు నాశనమునకు తప్పక ౧౩ విధముల శస్త్రాస్త్రము లుండవలయు నని

తెలియుచున్నది.

ఋగ్వేదము ౫-౭౫ మరియు ౧౦-౧౩ సూక్తములు: ఋగ్వేదము ౬వ మండలము ౭౫వ సూక్తమునయద్ధములో వాడబడు వర్మ, ఆర్త్ని, ఇషుధిః, రథః అశ్వాః (గుఱ్ఱములు), ధనుః, జ్యా, అభీషః, హస్తఘ్న బాణములు మున్నగు సాధనములు పేర్కొనబడినవి.

ఋగ్వేదము ౧౦వ మండలము ౧౦౩వ సూక్తములో ౧౩ మంత్రములు కలవు. అందు శత్రునాశనము పూర్తిగా చేయవలెనని తెలుపబడినది. ఈ సూక్తమునందలి ఈ మంత్రములు అథర్వవేదము ౧౯-౧౩లో యజుర్వేదము ౧౭వ అధ్యాయములో, సామవేద చివరి ౧౧వ అధ్యాయములో గూడ కలవు అందు కొన్ని ఇతర మంత్రములు కలవు. దీనివలన శత్రువు ఎడ ఎటువంటి సడలింపు వ్యవహారమునకు వీలు లేదని స్పష్టమగుచున్నది. అంతేకాదు. దానికి విరుద్ధముగ శత్రువుల ప్రముఖ వ్యక్తులను పట్టి పట్టి చంపి వారిని సర్వనాశనము చేయవలె నను సంకేతము కూడ కలదు పృథివీరాజ్ మహమ్మద్ గోరీని ఎన్నియో మార్లు వదలివేసి ఈ వైదిక **ఆ**దేశమును ఉల్లంఘించియుండెను.+ దాని దుష్ఫలితము నేటికిని గూడ అనుభవించవలసి యున్నది.

---

\+ దాదాపు ఈనాటి నాయకులకు రాజనీతి ఏమాత్రము తెలియ దని పించుచున్నది. పెద్ద పెద్ద భ్రష్టాచారులను కూడ ఏమి చేసినటుల కనప డదు. ఉదాహరణకు **ఆ**పత్కాలీన స్థితిలో ఎంతోమంది భ్రష్టాచారులు పట్టు బడిరి. వారిని ప్రభుత్వము ఏమి చేసినది? నిజముగా భ్రష్టాచారులను రక్షిం చుటకే కొందరు నాయకులైనారు. కోటానుకోట్ల రూపాయలు వ్యయము చేయు నాయకులను పట్టి బంధించు సామర్థ్యము మన సంవిధానములో లేదు. మన నాయకులలో లేదు. మన న్యాయాలయాలలో లేదు. మన ప్రజలలో లేదు. దీనికి కారణము దేశభక్తి లేకపోవుట. దేశభక్తులను

(మిగతా ౮వ పుటలో)

వేద సంహితలలో అస్త్రశస్త్రముల చర్చ:

వాశీమేకో బిభర్తి హస్త ఆయసీమంతర్దేవేషు నిధ్రువిః।
వజ్రమేకో బిభర్తి హస్త ఆహితం తేన వృత్రాణి జిఘ్నతే।
తిగ్మమేకో బిభర్తి హస్త ఆయుధం శుచిరుగ్రో జలాషభేషజః॥
(ఋ. ౮-౨౯-౩,౪,౫)

---

(౩వ పుట తరువాయి)
నిర్మించు ఒక పథకము వైదిక ధర్మములో కలదు. నాదృష్టిలో అది నెరయుచున్నది. అది సాకార మగుటకు చాల శ్రమ అవసరము. అది సాకారమయిన నాడు దుఃఖములో రాక్షు కలుపు మానవు లుండరు. లంచము ఇచ్చువా రుండరు. తీసుకొనువా రుండరు. ప్రజల ధనమును అగ్నిగా భావించి దానిని దొంగచాటున ఏ నాయకుడు ముట్టడు. మార్గములో పొరపాటున పడిపోయిన బంగారు ఆభూషణమును దాని అధిపతి తప్ప ఇతరులు ముట్టరు. మధ్యరాత్రిలో అందమైన యువతి ఆభూషణాలతో అలంకరించుకొని నగరములో ఒంటరిగ, నిర్భయముగా తిరుగగలదు. ఇటువంటి రాజ్యము సంభవము, సాధ్యము. చీనీ యాత్రికులు భారత దేశములో అబద్ధము మాట్లాడువారిని చూడగోరియు అట్టి వారు లేకపోవుట వలన చూడలేకపోయినారు. ఛత్రపతి శివాజీ పరాజిత మహమ్మదీయ రాజకన్యలు తన ముందుకు తీసుకరాబడగా వారిని పవిత్రముగా, సురక్షితముగా ఇంటికి పంపిన చరిత్ర ఉండగా సందేహానికి చోటు లేదు. ఇది కొంతమంది పవిత్రాత్మల ద్వారా పథకము వేయబడి దానిని సాకారము చేయుటకు ప్రయత్నించబడ వలయును. మా ప్రయత్నము దానికొరకే. మాగురుకులములోని బ్రహ్మచారులు(విద్యార్థులు) ఏ పుస్తకానికి సంబంధించిన పరీక్ష ఇచ్చుచున్నారో ఆపుస్తకము దగ్గర ఉంచుకొని పరీక్ష వ్రాయుదురు. కాని దానిలోనుండి దొంగిలించి పరీక్ష వ్రాయరు. ఇట్టి వాతావరణము నలుబది ఏండ్ల క్రితము మన దేశములో ఏబది శాతముండెను. (సంపాదకుడు)

కశ్యపః మనుర్వా,। విశ్వేదేవాః। ద్విపదా విరాట్।

ఈ మంత్రములలో వాశీ, వజ్రి, తీవ్ర పదునుగల ఆయుధ ముల చర్చ గలదు.

౨. విపర్వాశశ్చకర్త గామివాసిః॥(ఋ. ౧౦-౧౮-౬)

ఖడ్గము ఆవును ముక్కలుగ జేయునట్లే నీవు శత్రువును ముక్కముక్కలుగ జేయు మని ఉపమ చూపబడినది. ఇచట **'ఆవును'** ఖండించు ప్రసంగము గమనింపదగినది.

౩. ఏషామంసేషు రంభిణీవ రారభే హస్తేషు ఖాదిశ్చ కృతిశ్చ
సందధే॥ (ఋ. ౧-౧౬౭-౩)

ఈ మరుత్తుల భుజములపై శక్తి నామక ఆయుధము లేక పాశము మరియు చేతులలో కర్తనీ మరియు ఖడ్గము ధరింపబడినది.

౪. వాశీమంత ఋష్టిమంతో మనీషిణః సుధన్వాన ఇషుమంతో
నిషంగిణః।
స్వశ్వాః స్థ సురథాః పృశ్ని మాతరః స్వాయుధా మరుతో
యాథనా శుభమ్॥ (ఋ. ౫-౫౭-౨)

ఈ మంత్రమున వాశి, చురిక, ధనుస్సు, బాణము, తూణీరము, అశ్వారూఢుడు, రథికుడు, సైనికుడు-వీరి చర్చగలదు.

౫. ఇంద్రో యాతూనామభవత్పరాశరో హవిర్మథీనామభ్యావివాసతామ్।
అభీదు శక్రః పరశుర్యథా వనం పాత్రేవ భిన్దన్త్సత ఏతి రక్షసః॥
(ఋ. ౭-౧౦౪-౨౧)

ఈ మంత్రమున వనమును నరికి నేలమట్టము చేయు పరశు [గండ్రగొడ్డలి] వలె శత్రుసేనల నరికి పడవేయువాడు ఇంద్రుడని తెలుపబడినది.

స హి దీద్యానో భవతి పరశుర్న ద్రుహంతరః॥(ఋ. ౧-౧౦౧-౩)

౬. వృకం సంశాయ పవిమింద్ర తిగ్మం వి శత్రూన్ తాళి
వి మృధో నుదస్వ॥(ఋ. ౧౦-౧౮౦-౨)

సరణశీల పదునైన వజ్రమును చక్కగా పదును పెట్టి శత్రువుల పై ప్రయోగించి వారిని దూరము నెట్టి వేయవలెను. ఈ మంత్రమున 'పవి' నామక వజ్రము గురించి చెప్పబడినది.

౭. తవ వజ్రశ్చికిత వహ్నాహితో వృశ్చా శత్రూరవ విశ్వాని వృష్ణ్యా॥ (ఋ. ౧-౫౧-౧)

చేత వజ్రము గైకొని శత్రు (సైన్యము) బలము నంతయు ఛిన్నా భిన్నము చేయుము.

౮. అదేవేన మనసా యో రిషణ్యతి శాసాముగ్రో మన్యమానో జిఘాంసతి।
బృహస్పతే మా ప్రణక్ తస్య నో వధో నికర్మ మన్యుం దురేవస్య శర్ధతః॥ (ఋ. ౨-౨౩-౧౨)

ఓ బృహస్పతీ! దుష్టమనసుగల గర్విష్ఠుల వధించు ఆయుధము మమ్ము చేరకుండ నట్లు మాపై దయ చూపుము. దుష్టబలవంతుల కోపమును మేము లక్ష్యపెట్టకుందుము గాక!

౯. వృశ్చామి తం కులిశేనేవ వృక్షం యో అస్మాకం మన ఇదం హినస్తి॥ అథ. ౨-౧౨-౩॥
పాశే స బద్ధో దురితే ని యుజ్యతాం యో అస్మాకం మన ఇదం హినస్తి॥ అథ. ౨-౧౯-౨

౧౦. యది నో గాం హంసి తం త్వా సీసేన విధ్యామః॥అథ. ౧-౧౬-౪॥
గోహంతకుని సీసపు గుండుతో చంపవలె నని తెలుపబడినది.

వేదసంహితలలో సంహారక అస్త్రముల సంకేతము—

ఇంతవరకు సంహితలలో వర్ణింపబడిన సామాన్య ఆయుధములు పేర్కొనబడినవి. ఇపుడు గొప్పగొప్ప మారణ (సంహారక), దూర మారక, భయంకర అస్త్రములు వర్ణింపబడుచున్నవి.

అణుబాంబు వంటి అస్త్రములు—

౧. అవసృష్టా పరాపత శరవ్యే బ్రహ్మ సంశితే। గచ్ఛామిత్రాన్
ప్రపద్యస్వ మామీషాం కఞ్చనోచ్ఛిషః॥ సామ. ౧౮౬౩॥
ధను శత్రోరపకామం కృణోతి ధన్వనా సర్వాః ఆశా జయేమ
॥ఋ. ౬-౧౪-౨॥

శత్రువుల విజయ కోరిక నశించి మేము సమస్త దిశలను జయించ గల్గుటకు ఉపయోగపడునవి ధనుస్సు (అస్త్రప్రక్షేపక యంత్రములు) అణుబాంబులను వర్షించు బాంబు వర్షకములు లేదా స్టైన్‌గన్‌లే కాగల్గును.

ఇటువంటి శరపరంపర వల్ల శత్రువులలో ఒక్క మనుష్యుడు గూడ మిగులకుండ వినాశన మగును. అది స్టైన్‌గన్ గుండ్ల నుండి లేదా అణుబాంబుల విస్ఫోటము నుండి వెడలిన ధూమమే యగును.

౨. కపోతోలూకాభ్యామపదం తదస్తు। అథ. ౨౬-౯-౨॥

మా రాష్ట్రము శత్రువుల కపోతములనుండి. ఉలూకము (గుడ్ల గూబ)లనుండి సురక్షితముగా నుండుగాక. అని ఇచట పేర్కొనబడినది. కపోతమన నీరు (నిరుక్తం) గాలి(నామావలి) అను రెండర్థము లున్నవి.

ఉలూకమన జలాంతర్గామి అని అర్థము."వలతే అసౌ ఇతి ఉలూకః" వల సంవరణే, సంచలనే చ, **A Large Snake** (మోనియర్ విలి యమ్స్.) ఈ రెంటిని కలిపి చూడుడు. పామువలె (నీటిలో) దాగి నడచు నది. ఇటువంటిది ఏదేనొక యంత్రమో జలాంతర్గామియో కాగల్గును.

౩. అగ్నిర్హి విప్రో జుషతాం హవిర్నః పరి హేతిః పక్షిణీ నో వృణక్తు।
(అథ. ౬-౨౩-౨)

ఇతర రాజ్య విద్వాంసుడు,నాయకుడు లేదా మంత్రి మా ద్వారా ఇవ్వబడిన పన్ను లేదా ఆహ్వానమును ప్రీతితో గ్రహించు గాక. ఆయన వద్ద గల రెక్కల ప్రక్షేపాస్త్రములు మమ్ము విడిచిపెట్టుగాక, మా రాష్ట్ర ముపై పడకుండు గాక. ఇవి 'పృథివి' వంటి ప్రక్షేపాస్త్రములు.

౪. శశః క్షురం ప్రత్యఞ్చం జగారాద్రిం లోగేన వ్యభేదమారాత్॥

॥ ఋ. ౧౦.౨౮.౯ ॥-కుందేలు వలె మంద (ప్లుత) గతితో నడచు ప్రక్షేపాస్త్రము, హింసక తీవ్రగోళ్ళు గల్గి పర్వతమువలె నున్న ట్యాంకును మ్రింగివేయును. దీనికి 'కుందేలు సింహమును మ్రింగు'నని సాయణాచార్యుడు చేసిన భాష్యము త్యాజ్యము. అట్లే పర్వతము వంటి (పేట్రిన్)ట్యాంకు = కుండమును = ఒడను (లోగేన)(న్యాట్ విమానము ద్వారా ప్రయోగింపబడిన) చిన్న గోలితో కడుదూరము నుండి ఛిన్నా భిన్నము చేసినాను

ట్యాంకు యొక్క స్పష్ట వర్ణన:-

మృగో న భీమో కుచరో గిరిష్ఠాః పరావత ఆజగన్థా పరస్యాః।
సృకం సంశాయ పవిమిన్ద్ర తిగ్మం విశత్రూన్ తాఢి విమృధో
నుదస్వ ॥ ఋ. ౧౦.౧౮౦.౨ ॥

భీకర సింహము వలె పృథివి పైనను, ఎత్తుపల్లముల పైనను గిరి పర్వతముల పైనను నడచునట్టి సాధనము అనగా ట్యాంక్ చాల దూర దూరము వరకు పోవుచు వచ్చుచుండును. దానిపై నెక్కి సైనికులు తీవ్ర వజ్రముతో శత్రువులను తరిమి చాల దూరము వరకు వెళ్ళగొట్టెదరు.

ఇషుః । ఇష్యతి గచ్ఛతీతి, నమః వజ్రనామసు । ఇట వజ్రి మన గోలి (గుండు). ఈ విస్ఫోటక మందు గుండుకు ప్రమాణము చూడుడు. దీనితో బాటే విస్ఫోటక మందు పాతరల శోధించు పరిశోధనా దళముల, శత్రు సంహారక దళముల చర్చగూడ చూడుడు.

బాంబు మరియు విస్ఫోటక మందు పాతరల కనుగొను దళము:-

సుపర్ణస్త్వాఽన్వవిందత్ సూకరస్త్వా ఖనన్నసా।
దిప్సౌషధే త్వం దిప్సంతం, అవకృత్యాకృతం జహి॥ అథ. ౫.౧౪.౧॥

ఉష-దాహక పదార్థము (విస్ఫోటక మందు-బారూద్)ను ధరించు ఉషధి బాంబు. ఇట్టి బాంబులను ఉంచుకొనుటకు ప్రయోగించుటకు అను మతి నిచ్చు సేనాపతి గూడ ఉషధి అనబడును. ఈ మంత్రములో

ఆకాశమున ఎగిరే దళములు నెలకొల్పిన మందు పాతర లుండ వచ్చును. కావున వానిని వెదకి కనుగొని ఆ పిదప సూకర (పరిశోధక దళముల) ద్వారా వాటిని త్రవ్వివేయుట కాదేశించి తన సేనాపతి కిట్లు విన్నవించెను. శత్రువు మనలను నాశనము చేయదలచిన రీతిలోనే అతనిని నాశనము చేయవలెను.

మోహనాస్త్ర(స్పృహతప్పి పడిపోవునట్లుచేయు బాష్పము) ప్రయోగము—

అమీషాం చిత్తం ప్రతిలోభయంతీ గృహాణాంగాని- అప్వే పరేహి।
అభిప్రేహి నిర్దహ హృత్సు శోకైరంధేనామిత్రాస్తమసా
సచంతామ్॥ ఋ. ౧౦-౧౦౩-౧౨॥

ఈ మంత్రమున శత్రువుల చిత్తములను విలబ్ధము చేయు అంగ ప్రత్యంగములను బంధించు, హృదయములలో మంటను (తాపమును) పుట్టించి నిరాశద్వారా వారికి అంధకారముతో కూడిన విస్మృతిని కలిగించు అప్వా (ఉత్పన్నమైన ప్రదూషణమును మరియు ప్రదూషణమును ఉత్పన్నముచేయు] పాపదేవతా (బాష్పము, వాయువు) ను తననుండి దూరము పారద్రోలి శత్రువులను చేరు చర్చగలదు. ఈ వాయువు (బాష్పము) పాపదేవత అనబడినది. దీనిని ప్రయోగింపరాదు. కాని శత్రువు దీనిని ప్రయోగించినచో అతనిపై 'అప్వా'ను ప్రయోగించుటకు వెనుకాడరాదు.

జలవాయు ప్రదూషణ ఓషధి-రాసాయనిక శాస్త్రము—

పైన ఓషధికి బాంబు (దాహకపదార్థ ధారకము) అని అర్థము చెప్పబడినది. కాని జలవాయువులను దూషితము చేసి శత్రువుల నశింప జేయుటకు కొన్ని విషపూరిత ఓషదులు లేదా ఓషధులచే నిర్మింపబడిన రాసాయనిక ద్రవ్యములు శస్త్ర అస్త్రముల రూపమున ప్రయోగింపబడును.

అథో యో అస్మాన్ద్విప్సతి తము త్వం జహ్యోషధే ॥అథ. ౫.౧౪.౨॥
పునః కృత్యాం కృత్యాకృతే ప్రతిహరణేన హరామసి॥అథ. ౫.౧౪.౮॥

కాని వేదము ననుసరించి కృత్యా-జల వాయువుల ప్రదూషణ ఓషధి మరియు రసాయనిక శస్త్రముల ప్రయోగమును శత్రువు వీటిని ప్రయోగించినపుడే చేయవలయును. శత్రువు వీటిని ప్రయోగింప కున్నచో నీతి ననుసరించి వీటి ప్రయోగము నిషిద్ధము.

కృతవ్యధని విధ్య తం యశ్చకార తమిజ్జహి।
న త్వామచక్రుషే వయం వధాయ సంశిశీమహి ॥అథ. ౫-౧౪-౯॥
కృత్యామ కర్తారమృచ్ఛతు ॥అథ ౫-౧౪-౧౧॥

ఈ 'కృత్యా' లేక అభిచార క్రియలను శత్రువులు ప్రయోగించి నపుడే నాశనము చేయవలయును. వీలన మనము గూడ వాటి ప్రయోగము నెరుగుదుము. మరియు వాటిని బాహాటముగ ప్రయోగించుటకు మన కవ కాశము లభించినది.

శత్రువుద్వారా ప్రయోగింపబడిన ఈప్రయోగములకు ప్రతీకారముగ మన సామర్థ్యముద్వారా వీటిని నిస్తేజము, వ్యర్థము చేయగలము.
యే అపేషన్ యే అదిహన్ య అస్యన్ యే అవాసృజన్।
సర్వే తే వధ్రయః కృతా వధ్రిర్విష గిరిఃకృతః॥అథ. ౪-౬-౮౭॥
అవకాదానభిశోచానప్సు జ్యోతయ మామకాన్।
పిశాచాస్త్సర్వానోషధే ప్రమృణీహి సహస్వచ॥అథ. ౪-౩౭-౧౦॥
త్వయా వయమప్సరసో గంధర్వాంశ్చాతయామహే।
అజశృఙ్గ్యజ రక్షః సర్వాన్ గంధేన నాశయ॥ అథ. ౪-౩౭-౨॥

వీనియందు శత్రువు ద్వారా ప్రయోగింపబడిన ప్రదూషణకర ప్రయోగాస్త్రములను అజశృంగీ మున్నగు ఓషధుల మరియు వాటి ధూమ గంధముల ద్వారా నిష్ప్రయోజనము చేసి వాటిని నాశనము చేయవల యునను ఆదేశము గలదు.

ఈ విధముగ వేద సంహితలలో చిన్నా పెద్ద భీకర నరసంహారక దివ్య, అసురీ మరియు నిషిద్ధ సమస్త శస్త్రాస్త్రముల వర్ణన, వానిప్రయోగ విధి శత్రువుల ద్వారా అవి ప్రయోగింబడినపుడు వాటిని నిరర్థకము చేయు ఉపాయముల చర్చగూడ గలదు○